# ఉపోద్ఘాతము.

శ్రీమాన్ గంధం నృసింహాచార్యకవి విరచితమగు "శ్రీమాధవ" శతకము నామూలాగ్రము చూచితిని. ఆనందించితిని. బృందావనమున మల్లెచెట్లెట్లు పూగ నున్న కొలందిని చూపఱకు మఱింత సౌఖ్యదాయక మగునట్లే యింతవఱకాంధ్రమున నెన్ని శతకరాజములున్న నివి మఱల నేటికనరాదు. వివిధ సువాసన ద్రవ్యములం జేర్చి పెట్టియుంచి, లోకమునకందిరుగు వర్తకునివలె నమూల్యములై సౌఖ్యావహములగు చిత్రవిచిత్ర, భిన్నభిన్న విషయప్రదర్శనములు గలిగి, శతకపేటికలెంతయు ముద్దులు మూటగట్టుచుండును. పరిమాణమా కొంచెము. విషయములా యనేకములు. నీతులా కుప్పదెప్పలు. శతకగ్రంథములు సాహిత్యలక్ష్మికి విడువరాని యనర్ఘాలంకారములే.

మాధవశతకము వ్రాసి తన యిలవేలుపును సేవించి కృతకృత్యుఁడయ్యెను. శైలి సులలితమై నాతికఠినమై ధారాళమై వెలయుచున్నది. కొన్ని సందర్భములలో భావము నందముగఁ బ్రోవచేసెను. ఇతని కవితాలత సుమనస్సమితిచే సంభావనీయము కాఁదగియున్నది. ఇంటిపేర కృతికర్తగారి (యింటిపేరే యితని) యశస్సౌరభమును దెసల నింపగలదు. ఈ కవి యింక నిట్టి గ్రంథములు వ్రాసి, యాంధ్రభాషాసేవ చేయఁగాతమని నాయభిప్రాయము.

ఇట్లు,

కవిసింహ డి. రాజశేఖరం.

యోగ్యతాపత్రము.

శ్రీః.

శ్రీహయవదనప్రసీద.

శ్రీకృష్ణ జి॥ వ॥ మహాదేశికానుగ్రహః.

నైజాం యిలాకా జటప్రోలు సంస్థానాధీశ్వరుల పోష్యవర్గములో చేరిన ఈ శ్రీమాన్ గంధం వేంకటనరసింహాచార్యులవారు రచియించిన ఈ మాధవశతకమును సంపూర్ణముగా ఈకవివరుల ముఖవచనమువల్ల విని సంతసించితిని. ఈగ్రంథమున సుభాషితములు మిక్కిలి స్వభావోక్త్యలంకారములను తేటపరచుచు సరసముగా నున్నది. కీ ఇకిది ప్రథమగ్రంథరత్నముగా

నున్నది. ఇంక ననేక గ్రంథములను రచించుటకు శక్తిగలవారై యున్నారు. స్వల్పకాలములోనే వీరు అనేక గ్రంథములను రచియించి మహాకవీశ్వరులనే పేరును సంపాదించుకొనునట్లు శ్రీహయగ్రీవులు వీరికి వాక్ఛక్తిని అనుగ్రహించి వీరిని కటాక్షించవలయునని శ్రీహయగ్రీవులను నేను ప్రార్థించుచున్నాను. పాఠకులందరు వీరి ప్రథమ గ్రంథరత్నమగు ఈమాధవశతకమును సంపూర్ణముగా చదివి తమ మిత్రవర్గమునకుకూడ ఇందులోని నీతివాక్యములను విశదపరచగలరని నమ్మినాడను.

హా॥ శ్రీనివాసదేశికాచార్యులు,

ది 15-4-31.

ఆస్థాన విద్వాంసులు,

వనపర్తి - గద్వాల.

శ్రీ

# మాధవశతకము.



ఉ. శ్రీరమణీమణిన్ హృదయ సీమ వసింపఁగఁజేసి ప్రేమ దై
వారఁగ నర్మగర్భముగ భాషిలుచున్ సకలార్థ తత్వముల్
భూరి కృపాంతరాళమున బోధన సేయుచు భక్తకోటి క
వ్వారిగ సౌఖ్యమిచ్చు నిను భక్తిఁ దలంచెద నెప్డు మాధవా! 1

చ. చదువఁగ లేదు శాస్త్రముల సర్వజనాళికి మెప్పుగూర్ప నా
పదములయందు భావమునఁ బ్రజ్ఞయు లే దిసుమంతగాని నా
కొదవిన భక్తిచే నెటులనో శతకంబును వ్రాయఁ బూనితిన్
ముదమున నాకుఁ దోడ్పడి యమోఘ పటుత్వము నిమ్ము మాధవా! 2

చ పరులకు మేలుగల్గఁ జెఱుపఁగ దలపెట్టుచు దుష్టబుద్ధితో
నిరతము నిద్రబోక తమ నేర్పునఁ గీడును గల్గఁజేయు నా
పరమ దురాత్ములీశ్వర సెబాసని మెప్పును గాంతురిగాక, నె
క్కరణిని నైన వారలకుఁ గష్టము తప్పనె నొందు మాధవా ! 6

ఉ. రూపములేక నీవు బహు రూపములన్ ధరియించి భక్తసం
తాపముఁ బాపుచుందువు యథార్థము దీని నెఱుంగలేక, మా
పాపములన్ దలంపక యపారముగా నినుఁ దిట్టుచుందు రే
యోపికలేక నన్నియును నోపికతో గ్రహియింతు మాధవా ! 7

చ. తొలి భవమందుఁ జా సుకృత దుష్కృత మేదియొనర్చెనో యటుల్
ఫలము లభించుగాని యది పాయునె దీని నెఱుంగలేక నీ
చులు నినుఁ దిట్టుచుందురి మధుసూదనుఁడో యల రామచంద్రుఁడే
ఫలమును బొందె ? మానిజనవంద్యుఁడు సయ్యన నాడు మాధవా ! 8

చ. తలఁపఁగ బంధు మిత్రుడవు తల్లియు దండ్రియు నీవకావె, నిన్
దలఁపఁగలేక నెల్లపుడు దారసుతాదులు బంధుమిత్రులున్
ఫలమును గూర్తురంచు వెడబాయక మోహముఁ జెందియుండి, యా
ఫలమును గాంచి యేడ్తురది పాయునె యప్పుడు నేడ్వ మాధవా! 9

ఉ. కష్టముఁ జేయువారలకు గాక ఫలంబది కల్గబోవునే
తుష్టిఁ భోజనంబుగొని తూగుటుయ్యాలలఁ బవ్వళించి తా
దృష్టముతోడ నొక్క క్షణ మేనియు నిన్నుఁ దలంపకుండి బల్
గష్టములొందు వేళ వెతలన్ దయమాన్ప మటందువే మాధవా! 10

చ. కొడుకులఁ గాంచ వనుచుఁ గుందగ నేటికి నూర్వుగుండియున్
బడయుగలేని పాట్లఁగని వంతలచే ధృతరాష్ట్రుడప్డు, మేన్
విడిచెనుగాదె, దుష్టుల వివేక విహీనులకన్న పుత్రులే
కొడుకులు లేక యున్నచాలు యొనగూడును సౌఖ్యములన్ని మాధవా! 11

ఉ. గౌరవమబ్బునట్టి ఘనకార్యము లెప్పుడు సేయగాలేక
సూరులు మెచ్చునట్లు బలుసొంపుగ విద్దెలఁ బొందగావలెన్
భూరి దరిద్రదుఃఖమది పోవుటకై మది భక్తిఁగల్గి వే
సారక నిన్నుఁగొల్వ నిక సౌఖ్యముగల్గదె వేగ మాధవా! 12

ఉ. కూటికిగుడ్డకై పరులకొంపలఁ గూల్చుచుఁ గూటసాక్ష్యముల్
నాటముగాను బల్కుచు నవారితస్నేహము జూపుచున్ మహా
బూటకముల్ వచించి కడుమోసముఁజేసెడి వంచగాండ్రు యే
నాటికినైన దుఃఖపడి నారకమొందరె వేగమాధవా! 13

చ. కులము తరింపఁ జేయగల కూతురు చాలదె యొక్కతైన పో
కులటలు వేవు రేల వెతఁ గుందుటకేకద సీతవంటి స
న్నృలత యొకర్తుకైన తను మెట్టినయింటికి పుట్టినింటికిన్
ఘనము లభింపఁజేయు; మరి బాయెనుగాదె యఘంబు మాధవా! 14

చ. కలియుగమందు నిశ్చలతఁ గాంచి మనంబున ధ్యాననిష్ఠులన్
గలిగి క్షణంబు గాని నిను గర్వము లేక ధ్యానించినంతనే
ఫలము లభింప జేయుదని పల్కుదు రార్యులు ; యింతకే నినున్
దలచెడు బుద్ధిపుట్టదిక ధన్యతఁ గాంచుటయెట్లొ మాధవా ! 15

చ. ప్రతిదిన మెందఱో భువికి వచ్చుచునుండుట పోవుచుండుటల్
కుతుకము దుఃఖమున్ మరియు ఘోరరణం బొకచోటనుండుటల్
ప్రతినిమిషంబు గాంచుచును, బాపురె ! యేటికొ మూఢమానవుల్
మతిచెడి మోసపోయి వెతలన్ బడి యేడ్తురు గాదె మాధవా ! 16

ఉ. దానములందు శ్రేష్ఠమగు దానము విద్యయటంచు గొందఱున్
పూనికఁ గల్గి తామభయమున్ శరణార్థులకిచ్చుటే మహా
దానమటంచుఁ గొందఱును తర్కము సేయుచునుందురి గాని, నే
దానములందు గొప్పది నిదానమటంచు దలంతు మాధవా ! 17

చ. చదువది యెంతయుండినను సజ్జనగోష్ఠియు లేకయున్న నా
చదువు నిరర్థకంబు మఱి సజ్జనగోష్ఠియె లేకయున్న మేల్
పదవి లభింపఁబోదు తనపాండితి వన్నెకురాదు స్నేహితుల్
వదలుదు రిట్టి దుర్గతికిఁ బాల్పడనేల నరుండు మాధవా ! 18

ఉ. ఆసను పొట్టకై పరుల సన్నిధిఁ జేరి కరంబు హీనతన్
బూని మహానుభావుఁడవు భూపతి నార్యుఁడవంచుఁ బల్కినన్
గాని, యదేమొ సుంత గనికానముఁ జూపరు సర్వసౌఖ్యమున్
గాని యదే స్వీకరంబనుచుఁ బొంగుదు రల్పు లదేమొ మాధవా ! 19

చ. పతివటుగట్టి పెట్టి తనప్రజ్ఞనుఁ జాటుచు నోరుజేసి, సం
తతము సుఖోరుచున్ బలికి నాదరణంబును జూపుచుండి, యే
హితవును లెక్కబెట్టక నొకించుక పాపము నెంచనట్టి దు
ర్మతిని సృజించి మాకు నవమానము గూర్చెద వేల మాధవా ! 20

చ. పరమకృపాసముద్ర ! మునివందిత ! కారణరూపధారి ! నే
నిరతము నిన్ను నేమరక నెమ్మది నెంచుచునున్నగాని నా
దురిత మదేమొ కాని యొకతూరిఁ గనంబడ వేలనో మహా
ఫలదుఁడవన్న పేర్వడయవా ! తగునా ! యిదినీకు ? మాధవా ! 21

ఉ. ఉల్లమునందు నక్కటిక మూనక పుత్రునిఁ బెక్కుభంగులన్
దల్లడిలంగఁ జేయ మది ధైర్యము దగ్గక నిన్ను గొల్వగా
నల్లన స్తంభమందు దయనుండి రయంబున హేమకశ్యపున్
ద్రెళ్లగఁ జేసి భక్తునికిఁ బ్రీతి వరంబులనీవె మాధవా ! 22

ఉ. పాండవులెల్లరన్ వనికిఁ బంపియుఁ దృప్తివహింపబోక బల్
దుండగ మొప్ప వారలను లొంగగఁ జేయగ నెంచి గాదె తా
నొండువిధమ్మునన్ జెరుపునొందెను నాడు సుయోధనుండు; యో
క్కండు మఱొక్కటిన్ దెలుపగా నసమర్థుఁడు గాదె మాధవా ! 23

ఉ. భూరికృపామయుండవయి భుక్తికిఁ గొంతయొసంగితీవు, నే
గోరను భోగభాగ్యముల గుందుచునుంటి మనోవ్యథన్ గడున్
వారిజనాభ ! నీచరణపంకజముల్ నెరనమ్మినాడ నన్
గారియ బెట్టి కింక గనికారముఁ జూపుము ! వేగ మాధవా ! 24

చ. కలికికుచద్వయంబుగని కామవికారము చేత నప్పుడే
బలితముగా మనంబటుల బట్టి తనున్ గమలాగుచుండ నా
చెలిదరిఁ జేర సాహసము జేయును నాపయి నేమిగాంచునో
తెలియడు జ్ఞానియైన నిక దేనికి జ్ఞానము కాల్ప మాధవా ! 25

చ. పరసతులెల్లఁ దల్లులుగ భావమునన్ దలపోసి, పూజ్యులే
వరుస మెలంగిరో యటుల వర్తిల మేలగుఁగాని, లేనిచో
పరమదురాత్ముఁడైన దశవక్త్రునిదుర్గతి పట్టకుండునే
వరుసగ బంధుమిత్రులును వంతలఁగుందగ దాన మాధవా ! 26

చ. ఒకపరి భార్యతోఁ గలహ మొక్కెడ బిడ్డలరోదనంబు ; వే
రొకదెస నప్పువాండ్ర పరుషోక్తులు; కూటికి లేని చింత యిం
కొకపరి ; యిట్లు చిత్తమున కూరట లేక తపించుచుందు ; నీ
వికఁ గరుణింపకున్న పృథివిన్ మనజాలను బ్రోవు మాధవా ! 30

ఉ. ఎయ్యెడ నేరిపేడిన నొకించుక లాభము గల్గ నేకటా !
నెయ్యముఁ జూపువారలు గణింపగ మిత్రులటంచు నెంచి యా
తియ్యదనంపుమాటలకుఁ దృప్తి వహించియు నూరకుంటి గా
నయ్యయొ దానియదార్థము నె చను గాదె మాధవా ! 31

చ. నిరతము నిన్ను నేమరక నెమ్మదిసంస్తుతి జేయుచుండినన్
గరుణ దలిర్ప వేల ; యొకనాటికి నైనను గాతువంచు నే
మురియుచునుంటి గాని యిటు మూడునటంచెఱుఁగంగ నైతి గా
నరయఁగ దోసకారులకె యబ్బును సౌఖ్యము గాదె మాధవా ! 32

చ. మనుజులు జీవితాంతమున మక్కువ నెందున నుంతురో యటుల్
దనువును బాసినంత భువి దప్పక బుట్టగ నౌనటందురిగా
మునినుత ! యిట్టికోరికల బుట్టగనీక యహర్నిశంబు నిన్
వినుతిని సేయు భాగ్యమును వేగరుణింపగరాద మాధవా ! 33

ఉ. కోరని కారికీవు కడుంగూర్తు వరాంచితలాభ మెప్డు నిన్
గోరిభజించువారిపయి గూరిమి జూపవదేమొ కాని వే
డారక నిన్ను నెమ్మదిని సంస్తుతిజేసిన పాండవాదులన్
ఘోరవనంబులన్ [illegible]మి కుందగ జేతువె నాడు మాధవా ! 3

చ. చదువరులైన శాస్త్రముల సారము జక్క-గ్రహించియున్న దా
సదమలశీలశాలియయి ఛాందసవృత్తిని యూని లోకపుల్
విధము నెఱుంగకున్న నవివేకునిరీతిగ జాటురింతురున్
నుదుట లిఖించినట్టిదను నోము ఫలంబది గాదె మాధవా ! 35

ఉ. బీదజనాళి కాపద లభించిన నయ్యది దొడ్డదైన నా
వేదన ద్రవ్యవంతులకు బెద్దదిగా గనుపించబోదు వా
రేదొక కష్టమొందిన నదే ప్రళయంబును జేతురంతకున్
మేదిని ద్రవ్యవంతుఁడెసుమీ యధికుండును భోగి మాధవా ! 36

ఉ. కాలము గానినాడు నధికంబగు కష్టమునొందు వేళ చు
ట్టాలు సమీపబంధువులు దగ్గఱి సాయము జేయబోరుగా
శ్రీలలనామణీ ప్రియము చే వెలనొందెను వేళ నందఱున్
వ్రాలి సమస్త ద్రవ్యముల ధస్మము జేతురుగాదె మాధవా ! 37

ఉ. కట్టడ లేనినాడు మనగర్వము విద్యయు లాభమివ్వదే
పట్టుననైనగాని సిరిపట్టుగ నిల్వగబోదు ; యేరుచే
పట్టరు గౌరవింపరు ; కృపామయ నీదయయున్నజాలు నా
కెట్టిసహాయమున్ వలదభీప్సితమున్ దగదీర్పు మాధవా 38

ఉ. కాలము జాలనప్పుడొక కష్టము గల్గిన దానివెంటనే
చాలఁగ జిక్కులే కలుగు సర్వము నాశనమౌను, బంధువుల్
మేలును జేయఁబోరు ధనలేమియు గల్గును గాన నింక న
న్నేలు మహాత్ముఁడీవెయని యెంచితి కావవె వేగ మాధవా ! 39

చ. కరయుగమున్ మొగిడ్చి కలకాలము కన్నులసంజ్ఞతోడనే
పరమపవిత్రుఁడై నిలిచి బాగుగ కార్యము లెల్లవేళలన్
జరుపుచునున్న గాని యొకసారియు మెప్పును గాంచఁబోరు, వి
ట్టులుగుచునుందురి, సేవ కడుహైన్యము గాదె తలంప మాధవా ! 40

ఉ. బాలుఁడునై పరాభవము బాపుకొనంగ మదిన్ దలంచు, చు
ట్టాలను వీడి తల్లిదెస డాయఁగఁబోయి సమస్త నీతులన్
జాలఁగ గాంచి నిన్ ధ్రువుడు సంస్తుతిఁ జేసి తరింపలేదొకో
బాలుఁడునైననేమి? నిజభక్తియె కావలె నీకు మాధవా ! 41

ఉ. ఒక్కరు రాముఁడంచును, మఱొక్క రమాపతియంచు నెంతు, రిం
కొక్కరు కాళికొప్పతని యుల్లమునం భజియించుచుందు రొ
క్కొక్కరి కొక్కరూపునను నుద్భవమందుచుఁ గోర్కెదీర్తు వీ
వక్కటికంబు బూన విధిన్యాయమె ? భక్తుఁడఁ గానె మాధవా ! 42

ఉ. ఆపదలందుఁజిక్కి జగమంతయుఁ జీకటిగా నెదోఁచు బల్
దాపము హెచ్చు వేఱొకరు రారుసహాయముఁ జేయనెంచి, యెం
తో పరితాపముల్ గలుగు నొక్కక్షణంబ యుగంబెయౌను, నీ
ప్రాపునఁ గోరినాఁడ నను వంతల దోఁపియకుమయ్య మాధవా ! 43

ఉ. సారమదప్ప యోపధుల సత్యము మందునకైన లేదు, యె
వ్వారలు కాని సత్యమును బల్కిన గౌరవమింత లేదుగా
పోరులటన్న మండిపడి వాదము జేయఁగఁ బూనుచుండు రీ
మారుపుఁ జూచియుఁ మిగుల మత్తిలియుంటివొ నీవు మాధవా ! 44

ఉ. ఆశ్రమధర్మముల్ మొదటి కన్నినశించెను నొక్కఁడున్న చో
నశుచిపులన్ విడంగవలె నయ్యెయొ యీకలికాలమందు నీ
యాశ్రయమే ఫలప్రదమునయ్యెను నెంతటివారికైన నీ
యాశ్రయమే శరణ్యమిఁక నాదటఁ బ్రోవవె వేగ మాధవా! 45

చ. ధనముఁ గలట్టివా డెపుడు దానిని రక్షణ సేయుఁబూని తా
ననయము సౌఖ్యమున్ విడిచి యక్కట! తస్కరు లేమిసేతురో
యని భయమొంది కాలమును వ్యర్థముగా వ్యయపెట్టుగాన నో
మునినుత! నిన్ దలంచు గుణముం సుఖమున్దయనిమ్ము మాధవా! 46

ఉ. దానముఁ జేయనట్టి ధనధాన్యములున్, ఖ్యాతిలేనిపాట, సం
తానములేని మానవుడు, ధన్యతఁ గాంచని జీవనంబు, నీ
ధ్యానములేని నోరు, పరదాస్యముఁ జేసెడువాని హైన్య మెం
తేని శుభప్రదంబె, వెతపెంపునె నీకృపలేక మాధవా! 47

ఉ. తప్పుగలట్టివారు తమతప్పులకెల్లఁ గ్రహించి నీచులై
యొప్పుకొనంగఁబోలరు, మరొక్కరు జేసిన స్వల్పనేరము
న్గొప్పగఁజేసి రిట్టికతనన్ ధర వంచకులైననేమి ? నీ
మెప్పును గాంచఁజాలరుసుమీ ! యెటుజేసినఁగాని మాధవా ! 48

చ. ధన మధికంబుగాఁగలిగి దాఁచిన కర్థికి నీక యెప్పుడున్
గొణుగుచు గష్టజీవివలెఁ గుందుచు ద్రవ్యము దేహమున్ స్థిరం
బని భ్రమియించుగాని తృణమైనను నిర్భజియింప రిట్టి య
ల్పులికి ధనంబుఁగూర్ప నెటు బుద్ధిజనించునొ నీకు మాధవా ! 49

చ. పరులెవరేని కల్లలు నిబద్ధిగఁబల్కిన మూఢుఁడై నిజం
బెఱుగక క్రుద్ధుఁడైన తనకే యపకీర్తియు ముప్పుగల్గఁగా
ధర నెవరెట్టినైచ్యమున దంభతనంబును బూనఁబోక ధీ
వరులు నుతించుమార్గమున వర్తిల మేలగుఁగాదె మాధవా ! 50

చ. అరయఁగ దుఃఖసంకరితమైన ప్రపంచమునందు దేహము
స్థిరమని యెంచఁబోక యెటుచేసినఁ జెల్లునటంచు నెంచి ధీ
వరులె భ్రమించుచుందురి ననువంటి యమాయకుఁ డొక్కఁడెక్కఁడే
తరమె నుతింపనాకు వరదాయక ! నీచరితంబు మాధవా ! 51

ఉ. రాగములేకయే మిగుల రాగముగల్గినబోలెఁ జూపుచున్
శ్రీగలవారి వశ్యమున జేరఁగనెంచి యనేకభూషణాల్
వేగ నలంకరించి తగురీతి మెలంగుచు డబ్బులాగను
ద్యోగము సేయు వేశ్యకు నధోగతి కాక మరేమి మాధవా ! 52

చ. నిరసనజేసి వ్యక్తిని గణింపకఁ జౌకగఁ జూచుచోట మేల్
కొఱకుఁ బ్రయాసమొంది వెతఁగుందుటకంటెను చిత్తశుద్ధితో
నిరతము పూజలన్ సలిపి నెమ్మది నిన్ భజియించినంత స
ద్వరములు గల్గకుండునె యవారితసౌఖ్యముతోడ మాధవా ! 53

చ. ఇతరుల మెప్పుఁ గాంచుటకు నెంతయు నిష్ఠను గల్గినట్లు సం
తతమును బాహ్యవేషములఁ దాల్చుచు జ్ఞానులుగా నటింతుర్వి స
స్మృతి భజియించువారలకు, భక్తియొకాలును గాని యట్లుస
మ్మతమగు వేషభాషలకు భద్ర మదెట్లు లభించు మాధవా! 54

ఉ. వేదరవంబుమాట పృథివీస్థలి వీనులవిందుగా వినం
గాదగుచోటులే యరుదుగా గనుపించును; నేడఁజూడ సం
వాదన ముఖ్యమం చితరభాషల నేర్తురు వేదమందు సం
పాదనలేదొ ముక్తి సులభంబుగఁ గల్గదొ? వేగ మాధవా! 55

చ. పలుకులు వేయునేల బహుభాషల నేర్చినవాఁడ గాను, నిజ
దలపున నుంచుటొక్కటియె న్యాయపథంబని మూఢభక్తితో
గొలుచుచునుంటి నెంతకును గూరిమిఁ జూపవదేమొ? నీదుహృ
త్ఫలకమునందు నన్ను దయఁబాయక నుంచుటె చాలు మాధవా! 56

చ. దరిశనమిచ్చుటో ఫలముదప్పకఁ గూర్చుటో, కాక నిట్లు నన్
నిరసనబుద్ధి జూచుటకు నేనెరవాడనె ; యేటికీవు నిన్
వరుసగఁ గొల్చుచుండినను బ్రాపురె ! కానగ రావు, లాభమున్
దొరకగనీవు, భక్తులను నొవ్వగ జేయుట మేల ? మాధవా ! 57

చ. అనిశము వెంటనంటి తిరుగాడెడి యార్గురుశత్రులన్ వెసన్
దునుమగలేని మానవుఁడు నూరువ్రతంబులు జేసి యేమి ? తా
ఘనుడగునెట్లు డాంబికుడు గాక నిజంబగు భక్తి వాని కే
యనువునఁగల్గు ; నారకమె యబ్బును పిమ్మటగాదె మాధవా ! 58

ఉ. సారవిహీన సంసరణసాగరపారముఁ జేరలేక ప
ల్మారులు మున్గితేలుచు నమానుష ప్రజ్ఞగలట్టి నావికుం
డేరుగలారు నీవొకడవేయని యెంచి భజించుచుంటి నన్
జేరగఁదీసి వేగఁ దరిజేర్పవె యీవెతఁ బాపి మాధవా ! 59

ఉ. జాయను గాంచలేక యనుజా ! యెటుఁబోయెను సీతయంచు మే
ల్గోయుచు నేడ్చుచున్ నటవి గోయుచుఁ జాడఁ నెఱింగి తప్పిమ్మరన్
వాయుసుతుండు నిన్ గని యవశ్యము భూమిజఁ దెత్తునంచు వే
సాయము జేసి నీకృపను జయ్యనఁ గాంచఁడె నాడు మాధవా ! 60

ఉ. ఆరయ సంస్కృతాంధ్రములం దక్కట యెంతయొ దవ్వునేగి నె
వ్వారికొ నూటికొక్కరికి పాండితియున్న తమంతవారలే
లేరని గర్వమొందెదరు ; పృథ్వి సరస్వతి నీచజాతులన్
జేరఁగ లేద దీనికి యిసీ ! కడుఁగర్వము గాంతురి మాధవా ! 61

ఉ. అన్నహితంబుగోరి తగదన్న పరాంగనలన్ వరింప మే
లన్న మహాత్ము లీపనికి హాస్యము సేయరటన్న యంచు బల్
మన్ననతోడఁ బల్కు నవమానము గూర్చ విభీషణుండు తా
గ్రన్నన నీవె దిక్కనుచు రావణభయంబు నొసంగి శరణ్యివం
చెన్నక గావలేద యిటులేటికి నాపయి కక్ష మాధవా ! 62

చ. శరణని యంతనే ప్రబలశత్రువునైనను బ్రోచువాడవట్
బిరుదము గల్గినాడ వట పేరునకే వహియించు వేవి ప
ల్కుదు నినుఁ గొల్చి యుంచుకయు లాభము లేక భజింపనేల ? నా
గరుణను గాంతునో తగముగాదనదో వచియింపు మాధవా ! 63

ఉ. సారము లేనిదం చెఱిగి సత్యము సంసరణంబునందె ప
ల్మారులు బుద్ధిపోవు, యిదిమాయయె కాక విచిత్రమో కదా ?
భారము గాకయున్న దయఁ బాయక నంటియు నంటనట్లు సం
సారమునందు నుంచి యనిశంబును నీ కృపఁ జూపు మాధవా ! 64

ఉ. అక్కట ధర్మభావమున కిక్క టికంబును జూపకుంచు నే
నిక్కముగా నెఱింగితిని. నేడు మొదల్ నినుఁ గొల్వ జాల నిం
కొక్కరి వేడుకన్న ఫలమొందెదవం చొకయాసగల్గె నా
యక్కఱ దీర్చకున్న శమయించుట వృద్ధము గాదె మాధవా ! 65

చ. కరి మొఱ నాలకించి తమకంబున దారిని గావ నెంచి శ్రీ
పరికరముల్ గ్రహింపక నెవారిసహాయము వేడకుండ నే
సరగున వచ్చి యామకరిఁ జక్రమునన్ దెగ నేసి భక్తునిన్
గరుణను గాచినాడవని గాదె తలఁచితి నిన్ను మాధవా ! 66

ఉ. నన్నయ తిక్కనాది కవినాథులు నీకృపచేత నే గదా
వన్నెయు వాసిఁ గాంచి తను పొందిరి చక్కజ మొంది యెల్లరున్
సన్నుతిఁ జేయ గ్రంథముల జక్కగ వ్రాసిరి గాదె తొల్లి నా
కెన్నడు గల్గజేసెదవొ యిట్టి మహాద్భుతశక్తి మాధవా ! 67

ఉ. హెచ్చుగ కోర్కెలన్ దెలిపి యెంతయు నొవ్వగఁ జేయఁ దండ్రి యే
మిచ్చిన నొల్లకున్న సుతు నెంతయు ప్రీతినిఁ జూచుగాని తా
జెచ్చెర వీడునే యటుల శీఘ్రముగా గృపఁ జూచి నాపయిన్
మచ్చర మూనకయ్య కడుమన్ననఁ బ్రోవఁగదయ్య మాధవా ! 68

ఉ. పెద్దలసేవఁ జేసినను నేరదు నిన్ను భజించినన్ ఫలం
బద్దిర! యొక్కటేయనుచు నార్యులు పల్కఁగ వింటిఁగాన నే
ముద్దులమూటగట్టు కవిముఖ్యుల గ్రంథములన్ పఠించి పల్
పద్దికమీరఁ గొల్చెద నవారితభక్తియుగల్గ మాధవా! 69

ఉ. ఎన్నఁగరానిభక్తి నటులెవ్వరు వ్రాయని గ్రంథరాజమున్
మున్నులభించె భాగవతమున్ బుధసత్తములెల్ల మెచ్చి పో
తన్నదిసొమ్మనంగ కవితన్ ధనవాంఛను విక్రయించకే
వన్నెయు వాసిఁగాంచె జనవంద్యుఁడతండె తలంప మాధవా! 70

ఉ. ఎంచఁగఁ గుక్కుటంబుల కొకింతయు ధాన్యపుగింజ తృప్తిఁగా
వించును, రత్నమొక్కటి లభించినవెంటనె కాలఁదన్ను నీ
వంచనచేత గౌరవమువాయును దానికి సుంతయైనఁ గా
వించర పెద్దఁజేసి పృథివీస్థలి రాజులు ప్రీతి మాధవా! 71

ఉ. మెచ్చి ప్రశంసఁజేసి కడుమిత్రుఁడటంచు దలంచి యొక్కనిన్
జెచ్చెరఁ గార్యభారమును నేర్పునఁదీర్పఁగఁ నేర్పఱించినన్
వచ్చువలాభమందు సగపాలును వేఱటనె సంగ్రహించి, తా
నిచ్చినవారినే గుదుక బిచ్చము నెత్తఁగఁజేయు మాధవా ! 72

ఉ. ఒక్కకుటుంబమందు సుతు లొందువిధమ్మున వాదులాడినన్
బ్రక్కననుండువా రదియె లాభమటంచు దలంచి యాజ్యపున్
జుక్కలు వహ్నిలోఁ నిడినచొప్పున పోరును హెచ్చుజేతు రీ
ఫక్కిని వారుజేయ ధనవాంఛనుగాక మరేమి మాధవా ! 73

ఉ. ఒక్కనికార్యమందు మనసొందువిధమ్మున నుంచి కార్యమం
దెక్కుడు శ్రద్ధఁబూన రిక నేర్పవహించియు స్వీయకార్యమం
దక్కట ! మోసమయిన వెఱపందడు, పాపమటన్న భీతిలే
దక్కటిలాత్మలన్ శమను డాదటఁ బోధించునె యెవ్వ మాధవా ! 74

ఉ. ఎచ్చటఁ డాఁగికొన్న తనకెంతటి యాసకొ నంతయున్న నే
మిచ్చెదమన్న మిత్తి కరుణించునె యిచ్చట వీడిపోవునే
చెచ్చెర నప్డు శ్రీహరిని జిత్తమునన్ భజియింపనందుకై
హెచ్చుగ నంత్యకాలమున నేడ్చిన నేమిఫలంబు మాధవా! 75

ఉ. పుట్టినయెల్లజీవులకు భూసురుఁడైన మరెవ్వడైననున్
గిట్టకతప్పునే? భువినిఁ గీర్త్యపకీర్తులు రెండునిల్చుగా
నెట్టిమహానుభావుడును నీల్గిన నేదొక కారణంబుపే
ర్వెట్టుచు చచ్చెనందు రరరే! యిదియెంతటిమాయ మాధవా! 76

చ. నిరుపమధైర్యశాలి తననేర్పున నెంతటికష్టకార్యమున్
వరుసగఁ జేయఁబూని తనప్రాణము నైన త్యజింప భీతిలం
డెఱుగమె? భీతితో బిఱికి యెప్పుడు చచ్చెదనో యటంచెదన్
నిరతము భీతిఁజెంది జననిందను గాంచునుగాదె మాధవా! 77

చ. అరయ సమస్తజీవులకు నక్కట! యొక్కవిధంబుగాక నొ
క్కరికి విచిత్రమేడలును కమ్మని సౌఖ్యము గూర్చియుండ మరొ
క్కరికి దరిద్రమిచ్చి కడుగాసిలఁ బెట్టుచునుంటి వేలనో
తరమె నుతింప నీమహిమ ధన్యత గాంచని నాకు మాధవా! 78

ఉ. ఒద్దికఁ గల్గియుండియు వివేకము, పెద్దలయందు భక్తి, యా
పద్దశలందు తోడ్పడుట బాపురె! యియ్యవి లేకయున్నచో
విద్దియ లేల? నట్టియవివేకునికన్నను మూఢచిత్తుడే
తద్దయు మేలు భక్తి దయఁ దప్పడు కార్యముపట్ల మాధవా! 79

చ. సరియగు ప్రాయమున్ గలిగి సర్వజనుల్ నుతియింప విద్దెలన్
వరుసగ్రహించి ద్రవ్యము నపారముగా గడియించి తండ్రికిన్
బరమసుఖంబు గూర్చనెడఁ బాపపుమిత్తినిఁ బంపి యేలనో
సరగునఁ బుత్త్రుఁ జంపెదవు సాటిజనుల్ వెతఁగుంద మాధవా! 80

ఉ. చెంతకుఁ జేర నీరు వెతఁ జెప్పిన హాస్యముఁ జేయుచుందు రి ర
వ్వంతయు ప్రేమఁ జూప రికఁ బ్రార్ధన సేసిన లెక్క సేయ కే
కాంతమునందు నుంటిమని యక్కట! దర్శనమైన నీరు ప్రా
ణాంతము గాదె పేదలిక మన్నివిధంబులఁ జూడ మాధవా! 81

ఉ. ఆకసమెన్న ఛత్రము దయాగుణముల్ గలవారె యాప్తులున్
దేకువ నన్నమిచ్చి వెతఁదీర్చెడు వారలె తల్లిదండ్రులున్
గాక మఱొండు సౌఖ్యమది కల్గునె బీదకుటుంబికప్డు నీ
వే కరుణింపకున్న నిక నెవ్వరు వారికి దిక్కు మాధవా! 82

ఉ. కొంచెపుమేలుఁ జేసి యది గొప్పగ నాత్మఁదలంచి తాము ని
ర్మించిన కార్యమెల్లఁ దగురీతి నొనర్పకయున్నఁ గ్రుద్ధులై
వంచనజేయఁ జూచెదరు, ప్రాజ్ఞులు తామిటు చెప్పుకొందురే
కొంచెపువారికే తగును క్రోధము మోసమదెల్ల మాధవా! 83

చ. అవసరమున్న వేళ బనులన్నియు వీడి ప్రీతిమానులాప్తులై
పవలును రేయునాకఁ గడుభక్తినిఁ జూపుచు నేర్చినంతగా
దినిరియొసంగి కార్యమది తీరినవెంటనె పల్క-బోరు సు
మ్మవసరమే ప్రధానమను సజ్జనులకుండునె నీతి మాధవా! 84

చ. పరమరహస్యమై వెతలఁబాపునదై యిహలోక సౌఖ్యముల్
బరువడిఁగూర్చి తాపముని స్వర్గసుఖంబును గూర్చునట్టిదై
వరలునో యట్టిమంత్రమది భక్తులకున్ గృపసేయువాఁడె తా
గురువనఁజెల్లుఁ గాక వెడగున్ గురువంచును బెట్లు మాధవా! 85

చ. దురితము సేయుచో మిగులవోసము, దానినిఁ గప్పిపుచ్చ నే
మెఱుగనివానివోలె నటియించుట రెండవతప్పు గాదె యె
వ్వరుఁ గనలేదుగాయనుచు వంచనసేయక నొప్పుకొంచు నీ
చరణము లాశ్రయించిన వెసన్ గరుణింపవె నీవు మాధవా! 86

చ. నిరుపమభక్తిమార్గమును నెమ్మది నిల్పుకొనంగలేక తా
మఱుగుచునుందురీ కాశికి, ప్రయాగకు బుణ్యమటంచు నెంచి యా
స్థిరమగుభక్తియే తమకుఁ జేకురియుండిన దేశదేశముల్
దిరుగఁగనేల నెల్లెడల లేవె? మహాత్ములకీవు మాధవా! 87

ఉ. వంశమునందు నొక్కఁడు గుణవంతుఁడు నేర్పరి యుండెనేని ని
స్సంశయ మొప్ప నెల్లరనుఁ జక్కఁగ వృద్ధికిఁ దెచ్చుఁ గాని తా
సంశయమొందునే ధనము జారుచుటంచును గీర్తియే ప్రభా
నాంశము గాఁ దలంచి తనువైనను వీడును గాదె మాధవా! 88

చ. పనిపడునప్పుడెల్ల దయఁబాయక ధర్మము నిల్పి దుష్టశి
క్షణమును శిష్టరక్షణము (గన్నుఁ జేయఁగ నుద్భవింతు వం
చని యనఘాత్ములాడు నుడు లక్కట! వ్యర్థము యేమొ, కాని చో
గ నటులుంటివేల? కలికాలపు మార్పును గాంచి మాధవా! 89

ఉ. వేదములుద్ధరించఁ బృథ్వీస్థలికిన్ దిగి మీనరూపమున్
సాదరబుద్ధిఁ దాల్చి మునిసత్తమునిన్ గని యెల్లనీతులన్
వే, దగుకీర్తిఁ దెల్పి యలవేదములన్ వెసఁ గాచినట్టి ని
న్నేదినమున్ భజింతు నిక నేటికిఁజాలము బ్రోవు మాధవా ! 90

చ. సురలును గాత్రులున్ గలిసి సొంపుగ పాల్కడలిన్ భజించి మం
దరగిరినిన్ మథింప నదితగ్గుటఁ గాంచిప్రియంబుఁ గూర్మ బల్
గరుణను బూని కూర్మమయి క్రన్నఁదానిని లేవనెత్తవే
యకయసుహృజ్జనాళిఁ గనుటన్నను పండుగనీకు మాధవా ! 91

ఉ. శత్రువహించి మానులను గాఁయఁబెట్టుచు నేరఁగాంచినన్
గుక్షిని వేసికొంచు కడుకూర్మిరుడునై చరియించు యాహిర
ణ్యాక్షునిఁ జంపనెంచి కిటివై వెసఁగూల్చవె తొల్లివాని, నీ
పక్షముఁ జేరువారికి నిఃర్గ్రిగ నేమిట లోటు మాధవా ! 92

చ. అరిభజియించి వంశమున కంతయుఁ జెడ్డనుగూర్తువేల నిన్
గరుణను గాచువాఁడొకఁడు గల్గిన ; వాఁడెటనుండువాఁడొకో
సరగునఁ జూపుమంచు పరుసంబులనాడు హిరణ్యకశ్యపున్
నరహరిరూపునన్ దునిమినావట భక్తునిఁగావ మాధవా ! 93

చ. బలినటు మట్టువెట్టుటకు వామనరూపముఁ దాల్చి యజ్ఞమున్
సలుపు మహాస్థలంబునకు సర్వజనుల్ వెఱగంద నేగి యా
వల బలిచక్రవర్తిఁగని వంద్యుఁడవై ముదమంది వేగ మూ
డడుగుల భూమి వేడవె యహో ! యలయింద్రునిఁ గావ మాధవా ! 94

చ. ధరఁగల రాజులందఱిని దర్పమణంచుటకై గయంబునన్
బరశువు దాల్చి నీవు మునివంద్యుడవై జమదగ్ని కొడుకై
యిరువదియొక్కసార్లు జని యెల్లనృపాలుర కొవ్వడంచి, భూ
సురులకు ఖ్యాతిదెచ్చితి వసుంధర రాముఁడనంగ మాధవా ! 95

చ. పరమదురాత్ముడైన దశవక్త్రుని ప్రాణముదీసి వానిసో
దరులకు నీతినేర్పుటకు ధారుణి క్షత్రియవంశమందు నె
ల్లరు నుతియింపఁ బుట్టి మునిరాజుల కెంతయొ మేలుఁగూర్చి, మా
మక్కరులగు వారలన్ దునిమి కావవె యీజగమెల్ల మాధవా! 96

ఉ. కంసుడు పెట్టుపాట్లకు జగంబున నోర్వఁగలేక యెల్లవి
ద్వాంసులు మానులున్ వెతలఁ బాపవెయంచు గడున్ భజింప నా
కంసునిఁ జంప దేవకికి ప్రాజ్ఞులు సంతసమందఁ బుట్టియున్
గంసునిఁజంపి భక్తులను గావవె బాధలఁదీర్చి మాధవా! 97

ఉ. రాచకులంబునన్ బుధులు ప్రస్తుతిసేయఁగఁ బుట్టి యెప్పు డా
లోచనసేయుచున్ బృధివిలోని విరాగముఁబూని కష్టముల్
సైచి, యహింస ముఖ్యమని చక్కనినీతిని నేర్పినా వహో
నీచకురత్వ మీధరను నిల్వగ బుద్ధుఁడవౌచు మాధవా! 98

ఉ. తోఁచినయట్లు వ్రాసితిని తోరపుభక్తిని నూటపద్దెముల్
నోఁచిననోము గాక నిటులుండ శతకంబును వ్రాయశక్తియుం
జూచినదేకదా కృపను జూపితి వంతియెచాలు నాకు, చే
చాచను ద్రవ్యమిమ్మనుచు సత్కృపయుంచుము యెప్డు మాధవా! 99

ఉ. శ్రీకరసౌఖ్యసంపదల చెచ్చెరఁ గూర్చి సతంబు నీపయిం
బ్రాకటభక్తిఁ గల్గి భళిరా! యని మెచ్చగ నెట్టికార్యముల్
దేకువఁ జేయశక్తిఁ దగురీతి నొసంగి కవిత్వమందు నా
కేకొలఁదిన్ గలుంగనటు లివ్వవె సద్వరమొందు మాధవా! 100

గీ. కులము శ్రీవైష్ణవంబు నేఁగొల్చుదైవ
మెన్న నాతఁడె గాన నాకున్నశక్తి
వలన మాధవశతకంబు వ్రాసినాడ
పేరు నరసింహుడందురు పెద్ద లెపుడు.